# అమ్మనబ్రోలు చెన్నకేశవ శతకము.

నాగినేని వేంకటకవిగారిచే రచింపఁబడినది.

1914.

శ్రీరస్తు

శ్రీరామపరబ్రహ్మణేనమః.

# అమ్మనబ్రోలు శ్రీ చెన్నకేశవశతకము.

ఇది

గుంటూరుజిల్లా ఒంగోలుతాలూకాలోజేరిన

అమ్మనబ్రోలుగ్రామవాస్తవ్యులును, కమ్మవంశజులునగు

## నాగినేని వేంకటకవి గారిచే

రచియింపంబడి

---

వెగ్గిరాల

ప్రబోధినీ ముద్రాక్షరశాలయందు

వ. నిరంజనశాస్త్రిగారిచే ముద్రింపంబడియె.



దీనివెల రు 0-4-0.

1914.



నాగినేని వేంకటప్పయ్య.

శ్రీరస్తు

శుభమస్తు, అవిఘ్నమస్తు

# అమ్మనబ్రోలు శ్రీ చెన్నకేశవశతకము.

---



రమణీశ యోగిజన చిత్త సరోరుహమత్తభృంగ సా
కార సురేంద్రవంద్య పద కౌస్తుభవక్ష సుధీరకోటి మం
దార సువర్ణచేల ముర దానవసంహార గోపికా మనో
హార సునీలవర్ణ ధర నమ్మనబ్రోల్పురి చెన్నకేశవా.

ద్విప్రాస.

౧. సారసమిత్ర శీతకర చారు విలోచన లోక రక్షణా
సారసనాభ సూరిజన సంస్మర సద్గుణ దీనపోషణా
సారసవాసినీ హృదయ సమ్మదదాయక సాధువార హిం
సారసికా దురాత్మహార యమ్మనబ్రోల్పురి చెన్నకేశవా.

అనుప్రాస.

౨. రక్ష విచక్షణాజ్ఞ సుర రక్షణ రాక్షస శిక్షణాని రా
ట్పక్ష పరోక్షలక్షణ విపక్ష జయాక్షయ భిక్ష దీక్ష సం
రక్షణ దక్షిణాప్త బుధ రక్షణ దక్ష ప్రతీక్ష్య పుండరీ
కాక్ష సుప్రేక్ష్య లోలధర నమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

## అంత్యప్రాస.

౪. శ్రీశుచిరాధరీ నరహ ♦ రీ వర సూరిచరీ మనోహరీ
ఘోర కృపాఢ్యకరీ కరి సు ♦ పోషకరీ మధుర ధురీణ శౌ
రీ రజితాంబరీ ధర హ ♦ రీ మధువైరి హరీ మురారి కం
సారి ప్రబోధరీ లహరి ♦ యమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

## ద్విపాది.

౫. సారవిశారదాబ్జకర ♦ సారసమిత్రకుమార సంస్మరా
సార విశారదాబ్జకర ♦ సారసమిత్ర కుమారసంస్మరా
హార రమణీయగాత్ర ధర ♦ రావణ దుర్మద రావణాదిసం
హార మణీయగాత్ర ధర ♦ నమ్మనబ్రోల్పురి చెన్నకేశవా.

## ఏకయతిత్రిపాది.

౬. నాగవితల్ప భక్తమత ♦ నాగ విభూషణ మానసప్రియా
నాగ విపక్షవాహ వర ♦ నాగసురక్షణ నిర్జరావనా
నాగ విమర్దనా సకల ♦ నాగరికాధిప శాంత సద్గుణా
యాగమవేద్య కీర్తికర ♦ యమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

## ముక్తపదగ్రస్తం.

౭. అబ్జధరాధరాధిప ము ♦ రాంతక శాత్రవభీమ భీమ మో
హాబ్జవిలాస లాసకను ♦ లాసన సేవిత దేవదేవ ర
క్షాబ్జ సుధామ ధామకన ♦ కాంబరవారణ రాజరాజ పా
లాబ్జ హితాజితాజి ధర ♦ నమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

౮. సమరసభావభావ విభు ♦ పావనరూపా పరపావనుం డనఘ
తమసు ప్రకీర్తిగాంచినగ ♦ పాలకనామ పగవానికీర్తి నఘ

మమత దలంపనేల ఘన • సా ప్రినుమా యనుమాన మేలనో
యమల మనుమ్మవాస ధర • నమ్మనబ్రోల్పురి చెన్న కేశవా.

౯. నందకుమార గీతకవి • నారదమౌని విలోలసజ్జనా
నంద దురంతకల్మష వి • నాశన పన్నగరాజతల్ప గో
విందముకుంద సుందర సు • విగ్రహ విగ్రహాభీమధామ నీ
యందము చందముల్ దలతు • నమ్మనబ్రోల్పురి చెన్న కేశవా.

౧౦. కమ్మకులంబునంబొడమి • కాంచన భూషణముల్ధరించి న
త్తమ్ములయందు నీరువలె • దారుచు గేరుచు వీధి వీధులన్
దిమ్మరిగా చరించినను • దివ్య భవత్పదసేవ నీసహా
యమ్మును మర్వనెతి మది • నమ్మనబ్రోల్పురి చెన్న కేశవా

౧౧. చదివెడి బాలురంగని యు • సంతసమొందుచు నాస నొందగా
నదియునొకండు వర్గముల • వ్రాయుడనో నను పాఠశాలలో
చదువగ వేసినారు గురు • సన్నిధి విద్యను నభ్యసించితిన్
వదియును నీదయారసమె • నమ్మనబ్రోల్పురి చెన్న కేశవా

౧౨. యెప్పుడు యేమిపాపములు • యీ జగమందున జేసినాడనో
తప్పులుచేసినన్ సుతుని • తప్పులు తండ్రి సహింపడేదయన్
దప్పక నీవునట్లె తమ • దాసుని నేరములెన్న కయ్యమా
యప్పవునీవె బ్రోవవలె • నమ్మనబ్రోల్పురి చెన్న కేశవా

౧౩. పాపులు జీవహింసకులు • బ్రహ్మమెరుంగని మూఢులున్ మహా
పాపు లసత్యవాదనులు • భక్త్యము ధర్మము లేని యూరిలో
కాపుర ముంచినాడ విక • గావగ భారమునీదెగాదె యో
యాపద బాంధవా వరద • యమ్మనబ్రోల్పురి చెన్న కేశవా

## విద్య.

౧౪. సుఖమిడు కీర్తిదెచ్చు వర ♦ సుందరుడంచనుపించు భూమిలో
నిఖిల జనంబు మెచ్చుగొను ♦ నిర్మలనేత్రము నిచ్చు నంతటన్
సఖులను బంధువుల్గలుగ ♦ సల్పును సామ్యము జెప్పరాని దీ
యఖిలము విద్యయేనొసగు ♦ నమ్మనబ్రోల్పురి చెన్న కేశవా.

౧౫. సతతము దిండియున్ భయము ♦ సంగమనిద్రలు నెంచిచూడగా
ప్రతి చతురాంఘ్రిజంతువుల ♦ మర్త్యులయందు సమంబుదోచ నిం
కితరమునందు మానవుల ♦ కెక్కువ చక్కని విద్యలేనివా
డతడొక రెండుకాళ్ళ పశు ♦ వమ్మనబ్రోల్పురి చెన్న కేశవా

## బ్రహ్మ లక్షణము.

౧౬. పాతకమైనకార్యములు ♦ బాయుట సర్వసమత్వభావమున్
నీతియు విద్యయున్ శుచియు ♦ నిత్య మసత్యము బల్కకుండుట
ఖ్యాతియు దేవభక్తి పర ♦ మాత్మ నెరింగిన తెల్విగల్గుచో
నాతడె బ్రాహ్మణుండు ధర ♦ నమ్మనబ్రోల్పురి చెన్న కేశవా

౧౭. కొందరు భాగ్యవంతులట ♦ కోవిదమార్గము నచ్చిరా
దందురు పేదవారలము ♦ కన్నము లేమి వినంగజాలమే
మందురు పండితుర్దాలను ♦ నందురు నేరికిబోష జేతు నీ
యందము నీకె దెల్పెదను ♦ యమ్మనబ్రోల్పురి చెన్న కేశవా

౧౮. ఆస్తికమయ్యు నీవు జగ ♦ మంతసృజించి వెలుంగనేయు నీ
యాస్తినెరుంగలేక కలు ♦ షాత్ములుకొందరు నాస్తికంబదే
వాస్తవమంచు బల్కెదరు ♦ వారిగ తేనియు గాగ జేతువో
యాస్తికమందె మాకు నిజ ♦ మమ్మన బ్రోల్పురి చెన్న కేశవా

౧౯. కారులు బల్కుచుండుటయు ♦ కల్లలునందరితోడ బెంచుటల్
జారతనంబు కుత్సితము ♦ సత్యముదప్పుట జీవహింసయున్
చోరకృతంబు నిర్దయయు ♦ జూదము పానము విద్యలేమియున్
నారయ నేరికైన తగ ♦ నమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

౨౦. కులముల ప్రేమ కొందరికి ♦ కొందరికిన్ మతభేదముంచి భూ
తలమున జారచోరులను ♦ తంత్రపు వాదుల నీదు భక్తికిన్
నిలుకడలేక జేసి మరి ♦ నిత్యము సత్యము బల్కరించి నీ
వలసట బెట్టనేల ధర ♦ నమ్మనబ్రోల్పురి చెన్నకేశవా.

ఐకమత్యము.

౨౧. గనుగొన వర్షబిందువులు ♦ కారుచు నన్నియు నొక్కరూపమై
ఘననదులై జనంబులకు ♦ కల్ప మహీజములట్లనొప్పు నీ
మనుజులకైకమత్యమటు ♦ మంచిదిగాదె దలంచిచూడ నీ
యనుమతిచేర్చు మందగిని ♦ యమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

సంసారము.

౨౨. భూరి దవానలంబుగతి ♦ పోవను మార్గముగానరాని సం
సారము చిక్కుకారడవి ♦ చందము నీదరిలేని సాగరం
బేరికినైన ఘోరమగు ♦ నిట్టిది నామెడగట్టిజూడ నీ
కారమణీయమేమి ధర ♦ నమ్మన బ్రోల్పురి చెన్నకేశవా

దారిద్ర్యము.

౨౩. కోకలుగోరునాలు మరి ♦ కూటికినేడ్చెడు పిల్లకాయలున్
బీకను తేనెటీగలుగ ♦ ప్రేమ గనుంగొను బంధులెన్న నీ
రాకరునైన మేఘములు ♦ నాశ్రిత మిత్రులులేమి నెంచగా
నాకలి గొప్పయగా నరక ♦ నమ్మనబ్రోల్పురి చెన్నకేశవా.

## ధనము.

౨౦. ధనము ప్రధాన మీజగతి • దాతకు సేతకు నీతికిన్ మహా
ధనము గణింపకున్న తన • దార సుతాదులు సౌఖ్యమొందరీ
ధనము భుజింపరానిది గ • దా దీనికి నెంత ప్రజ్ఞయో
యనిమిషవంద్య చోద్యమిది • యమ్మనబ్రోల్పురి చెన్నకేశవా.

౨౧. అర్థముసంగరాద తవ • యంఘ్రిసరోజము నమ్మువారికిన్
నర్థము లేకనున్న తమ • నర్చనజేసెడు భక్తకోటి స
ర్వార్థుల కియ్యనేర్పదురె • యాశ్రితులెత్తెడు ముష్టినీవు భ
వ్యార్థముగా వలంచెదవ • యమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

## స్త్రీమోహము.

౨౨. అంగముగాంచ తోలుచను • లందముజూడగ మాంసఖండముల్
యంగజు మందిరంబనుచు • నాడుదు రట్టిది మూత్రమార్గమే
నెంగిలినోరు పక్కులకు • నెక్కువముక్కులు చక్కనందురీ
యంగనమోహ మెట్టిదో • యమ్మనబ్రోల్పురి చెన్నకేశవా.

౨౩. గరళము పంచదారగతి • కంఠముజుట్టెడు పాశమట్లు పు
ణ్యరహితమైనభూమి పర • మార్థవినాశ సుకర్మ చక్కనౌ
నరకపు త్రోవ సాహసపు • నమ్మము నాదిని మైత్రియంతమం
దరిమది గాత్మపూరుషుల • కమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

## వేశ్యావృత్తి నిరసనము.

౨౪. విటుడొక నిద్రబోనివడు • విత్తముతాకకు దేహమమ్మి సం
కటముల నొందుతల్లి యొక • కట్టున నిల్పదు సోదరుండు ద్రా
గుటకు జెలంగు నంతమున • కూటికి నేడ్చును పెండ్లిలేనిచో
టునిక వేశ్యకేమిసుఖ • మమ్మనబ్రోల్పురి చెన్నకేశవా.

౨౯. గుడ్డికి నైన రోగియగు ♦ కుంటికి నైన కురూపికైన నే
మడ్డకు నైన పాపుడగు ♦ మందునకైన మనోహరంబుగా
దుష్టుకు నాశనొందిన వగ ♦ తా సుఖమిచ్చెడు వేశ్యసంగమం
బడ్డము లేక గోరదగ ♦ దమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

యశము.

3౦. శశికి కళంక మంబుధికి ♦ సామ్యము జెప్పగరాని యుప్పు స
త్పశువున కెన్న మూగతనము ♦ పర్వతసేతకు మంచు వేశ్యకున్
పశిమి సవాయివేల్పు గుడి ♦ వాకిట కానుకలాగువాడు నీ
యశ మొకటే వినిర్మలము ♦ యమ్మనబ్రోల్పురి చెన్నకేశవా.

నిష్ప్రయోజనము.

3౧. చదువులు గానివారు శృతి ♦ చక్కగ లేని సితారు సద్గుణో
న్నదతులు లేని స్త్రీలు వర ♦ శూరులు మెచ్చని సాము నాటలో
పదములు రాని పాట ఘన ♦ వర్తకులుండని పేటజూడగా
నదియొక నిష్ప్రయోజనము ♦ యమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

స్త్రీ విద్య.

3౨. స్త్రీలకు విద్యలేక చెడు ♦ చేరిన మందిర మూరు దేశమున్
బాలిక షోడశాబ్దములు ♦ ప్రాయము దాటకమున్నె శాస్త్రసం
శీలను సేయుమయ్య ♦ ధవచింతన భక్తి ఘనంబు మయ్య ప
ద్మాలయనాథ దేవనుత ♦ యమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

నీతి.

33. చెప్పలు బాయరాదెపుడు ♦ జెప్పినమాట వినంగరాదిలన్
నిప్పులు ద్రొక్కరాదసుర ♦ నీతులు బూనగరాదు యేరికిన్

తప్పులు సేయరాదు తమ ♦ దాపున జేరినవాని ద్రోయరా
దప్పులు డీయరాదు విను ♦ మమ్మన బ్రోల్పురి చెన్నకేశవా

సుఖము లేనివి.

౩౪. పాటలు లేని నాటకము ♦ పాకము దప్పిన భోజనంబు న
య్యాటలు లేని పొందు ప్రియ♦మాజ్యము జూపని విందు కొల్వులో
మాటలు రాని తేట మతి ♦ మంతులు మెచ్చని మాట జూడగా
హాటక చేల యేమి సుఖ ♦ మమ్మన బ్రోల్పురి చెన్నకేశవా

భక్తి ప్రధానము.

౩౫. అర్థము గోరి కొందరిల ♦ నాగమశాస్త్ర నిరర్థ కర్మముల్
వర్ధిల జేసి మర్త్యులకు ♦ వర్ణమతంబులు భేదముంచి రా
వార్ధకమేమి జూడ పుర ♦ షార్థము నిన్ను దలంపకుండినన్
వ్యర్థముగావె నన్నియును ♦ యమ్మన బ్రోల్పుర చెన్నకేశవా

ఆచరణ ధర్మము.

౩౬. ఎన్నగ నన్నమిచ్చుటయె ♦ యెక్కువదానము గన్నవారలన్
బన్నుగ పూజసేయుటయె ♦ భాసిలు ధర్మము బీదవారలన్
మన్నన సేయుటే ఘనము ♦ మానసమందున నీదుభక్తి యీ
టన్నిటికన్న మిన్నయగు ♦ నమ్మన బ్రోల్పురి చెన్నకేశవా

ఆశ.

౩౭. గ్రాసము లేకనున్న నది ♦ గల్గిన చాలనిదోచు మానికిన్
కాసొకటున్న నింకొకటి ♦ గావలెనంచు దలంచు ముత్యముల్
దోసెడు నున్న నింకనొక ♦ దోసెడు గూర్పగ దంగుచుందురీ
యాసకు మేర లేదుగద ♦ యమ్మన బ్రోల్పురి చెన్నకేశవా

### మాయకు దూరస్థుడు.

౩౮. అతివల చూపుటమ్ములకు ♦ నాత్మచలింపక నేరికుండునో
సతతము చందనాది యిహ ♦ సంపద లేరికి సౌఖ్యమీయవో
నతులిత ఘోరకోపమను ♦ నగ్ని దహింపక నేరికుండునో
యతనికి మాయదూరమగు ♦ నమ్మనఁ బోల్పురి చెన్నకేశవా.

### వరోపకారము.

౩౯. కోరకయున్న మేఘములు ♦ కొల్లగ నీరము నిచ్చుచుండెదుఁ
దూరమునున్న భాస్కరుడు ♦ తోయజముల్వికసింప జేయుచుం
డూరికె చంద్రుడాకలువ ♦ లుజ్వలమొందగ సల్పుచుండు ని
ట్లారయ కీవు ప్రోవవలె ♦ నమ్మనబోల్పురి చెన్నకేశవా.

### విఫలములు.

౪౦. ఆకలిగాని భోజనము ♦ నర్థమెరుంగనివిద్య గుల్కులుఁ
జోకులు లేని వేశ్య కవి ♦ శూరులు నవ్వనిహాస్య మాత్మలో
వ్యాకులమొందుచెల్మి భువి ♦ నర్థులకీయనికల్మి నెన్నగ౯
హాకరుణానిధే విఫల ♦ మమ్మనబోల్పురి చెన్నకేశవా

### దోషవర్జితులు.

౪౧. వారిజపత్రమందుబడు ♦ వారివలె౯ సఘృతంబు జిహ్వహా౯
బారియు నంటనట్లు మరి ♦ పంకము కుమ్మరిపుర్వురీతి సం
సారమునుండి పండితులు ♦ సంగమదోష వివర్జితాత్ములౌ
హారమణీయ నీదుకృప ♦ నమ్మనబోల్పురి చెన్నకేశవా

### నీతి.

౪౨. జారుడు రోగపీడితుడు ♦ చాలగ సోమరి బీదవా డహం
కారుడు గౌరవుండుభువి ♦ కల్మషదూరుడు పుణ్యమూర్తి స

త్పౌరుష శాలి శ్రీకరుడు ♦ పాపుకు ఘోరుడుకాగ నందరికా
నారశి జేసినాడ వీటు ♦ లమ్మనబోల్పురి ♦ చెన్న కేశవా

బలాత్కార వివాహము.

౮౩. చుట్టలు తల్లితండ్రులును ♦ జూడక పిల్లకు పిల్లవానినిక్
బట్టుకవచ్చి వారిమది ♦ భావమెఱుంగక పెండ్లిజేసినన్
కట్టున నిల్వ రిద్దరకు ♦ కల్లలుమొందు వరించకున్న చో
నట్టి వధూవరుల్గయ ♦ రమ్మమబోల్పురి చెన్న కేశవా

స్వయంవరము.

౮౪. సరసిజపాణి తాదగిన ♦ సద్గుణశీలుని ధీరవర్యునిక్
పరమకృపామతిక్ దనకు ♦ ప్రాణపతిక్ మదిగోరియుక్ స్వయం
వరమున పెండ్లియాడినను ♦ వారికిభాగ్యము సౌఖ్యముక్ సదా
యరమరలేకనుండు భువి ♦ నమ్మనబోల్పురి చెన్న కేశవా.

సుజన దుర్జన భేదము.

౮౫. ఉప్పును కప్పురంబుగన ♦ నొక్కటిపోలికనుండు కంటినిక్
చప్పరియించిజూడ రుచి ♦ జాడలు వేరుగనుండు ధారుణిక్
గొప్పగు మానులందునటు ♦ కూర్మియు కుత్సితముండు గాంచగా
నప్పగిదిక్ విచిత్రమిల ♦ నమ్మనబ్రోల్పురి చెన్న కేశవా

సర్వజనసమ్మతము మంచిది.

౮౬. ఆపద దీర్చువాని కిల ♦ నాపదవచ్చిన వేళ నందరుక్
పాపమటంచు బల్కెదరు ♦ పాపము జేసినవాని కావడల్
జూపినవల్లె కావలెను ♦ జూడుమటంచ్రు జనానుకూలు డే
యాపద లొందబోడు గను ♦ మమ్మనబ్రోల్పురి చెన్న కేశవా

## వ్యవసాయము.

౪౭. ఎన్ని పరోపకారములు ♦ నెన్ని మణుల్ గల వర్తకంబులున్
నెన్ని మహేంద్రజాలములు ♦ నెన్ని శరీరపరిశ్రమంబు లిం
కెన్ని వివేక సాధనము ♦ లెన్ని కసేయగ నిజ్జగంబునం
దన్నిటికన్న మేలు కృషి ♦ యమ్మరుఁ బోల్పరి చెన్న కేశవా

## అధర్మము.

౪౮. పురుషులకన్న నెమ్మదిని ♦ బోటులకామము నెక్కువందురా
వరునకు భార్యపోవనొక ♦ వాదిజలోచని పెండ్లిసేతు రా
గరితకు నాథుడూడనొక ♦ కాంతుని దెచ్చి వివాహమేల సే
యరో యిది యేమి ధర్మమహ ♦ యమ్మన బోల్పరి చెన్న కేశవా

## బుద్ధిశాలికి అయిదు మంచివి.

౪౯. పురుషుడు నైదుచందముల ♦ బుద్ధియు గల్గినవాడటండ్రు తా
పరసము బల్కకుండినను ♦ భామలభంగము సేయకుండినన్
పరధన మాశ బాసినను ♦ పండిత మర్త్యుల గౌరవించినన్
నరయగ నిన్ను వేడినను ♦ యమ్మనుఁ బోల్పరి చెన్న కేశవా

## కీర్తి శాశ్వతము.

౫౦. తనువులు నిల్వఁబోవు కుల ♦ తంత్రములన్నియు వైరముద్ధరన్
గనుగొన నస్థిరంబు కవి ♦ కల్పితశాస్త్ర విరుద్ధ వాదనల్
ఘనములుగావు యౌవ్వనము ♦ కాంతలసౌఖ్యము శాశ్వతంబుగా
దనిశము కీర్తియే నిలచు ♦ సమ్మన బోల్పరి చెన్న కేశవా

## కవి లక్షణము.

౫౧. కవిత్వము జెప్పువాని మది ♦ కల్పననింతని జెప్పశక్యమా
కవికి నెరుంగరానిదొక ♦ కల్పనలోకపు మర్మముండునా

కవి సుయశాంగముండినటు ♦ కర్మశరీరము నిల్పియుండునా
యవిమల మాయరూపధర ♦ నమ్మనబోల్పురి చెన్నకేశవా

పిలువని పేరంటము.

౧౨. పలుమరు వానయుర్ గురువ ♦ పాదుని వెల్వడటంచుదిట్టరే
బిలువకనన్నలై మాటికిని ♦ పెద్దలయిండ్లకునైన బోవగా
జులకన జూచుచుండుదురు ♦ జుట్టములైనను బిల్వకుండగా
వలవిధికైన బోవదగ ♦ దమ్మనబోల్పురి చెన్నకేశవా

దేవప్రియులు

౧౩. పాలును నీరుగూడి యొక ♦ భాసము నొందికీతినసర్వమున్
మేలుగజూచువారు మది ♦ మెచ్చగ జీవులబ్రోచువారుక
ర్మాలయమైనవారు కపటా ♦ త్మనెరుంగని భక్తకోటి ప
ద్మాలయనాథనీకుప్రియుల ♦ మ్మనబ్రోల్పురి చెన్న కేశవా

తత్వవేత్త లక్షణము.

౧౪. జ్ఞానముహీనమైన కుల ♦ కాముడు భేదము లెన్నుచుండు నా
జ్ఞానముగల్గువాడు కుల ♦ కాంక్షలనెన్నక సర్వజీవముల్
తానవిజూచుచుండు మది ♦ తత్వవిదుల్కులమెన్న బోరిలన్
పాసలినాక్ష దేవనుత ♦ యమ్మనబోల్పురి చెన్న కేశవా.

అపహాస సంకులములు.

౧౫. చపలమనస్కులై జనులు ♦ జన్మములెన్న కశూద్రులంచు ధీ
కపటులనన్ పరాశరి యగస్త్య వసిష్ట సువాల్మికాది స
త్తపనుల నెన్న నెవ్వరగు ♦ తంత్రములందరు నొక్కజాతి నీ
కపహాసమయ్యె నీకులము ♦ లమ్మనబ్రోల్పురి చెన్న కేశవా

శరీరాత్మలక్షణము.

౫౬. ఆత్మ శరముల్లలసి ♦ నన్నిపసుద్ధిగ జేయుచుండిన MADRA
యాత్మనురూప మెన్నటికి ♦ సదృశపూర్ణము దేహ మున్నగ
నాత్మను వేషగ్రూపమున ♦ నాడుచు బొప్పుచునుండు రెంటిలో
నాత్మ నశింపదెన్నటికి ♦ నమ్మనబ్రోల్పురి చెన్న కేశవా

మాయయతి లక్షణము.

౫౭. కాయపటంబుగట్టి మరి ♦ గడ్డము మీసెదు బెంచి భూతి తా
కాయమునిండబూసి యొక ♦ కర్రను బుర్రనుబూని మాలతో
మాయజపంబు జేసినను ♦ మాసికి ముక్తిలభించునే సదా
యీయతి యాశమాననలె ♦ నమ్మనబ్రోల్పురి చెన్న కేశవా

భక్తికి సాటిలేదు.

౫౮. యుక్తులు మెన్నినేర్చినను ♦ యోగముబూనిన రాగమాలతో
రక్తిగ పాటపాడినను ♦ రాజ్యములేలిన గాని జూడనీ
భక్తికి సాటిరావుగవి ♦ పాపవిదూరభవత్పదాబ్జముల్
వ్యక్తిగ పూజజేతుమది ♦ నమ్మనబ్రోల్పురి చెన్న కేశవా

దైవయత్నము.

౫౯. ఇడుము సుఖంబు మానవుల ♦ కెన్నగ నన్నియు దైవయత్నమే
కడువడి బావిలోబడిన ♦ గావబడుర్ దగియందు నుండినన్
జెడును గృహంబులోపలను ♦ క్షేమముగోరినరాదు మాసి కా
రడవుల నున్నవచ్చు శుభ ♦ మమ్మనబ్రోల్పుర చెన్న కేశవా.

మురికి లక్షణము.

౬౦. మురికియటంచు మానవులు ♦ ముట్టగుచేజెను ముట్టకుందురా
మురికిన బుట్టుబిడ్డలను ♦ ముద్దిడుచుందు రదేమిచోద్యమో

మునికి నమస్తదేహములు ♦ మోహము కల్పన జేసినావుగా
నరయగ నీమహాత్మ్యమిది ♦ యన్నన్ బ్రోల్పురి చెన్న కేశవా

బూటకపు గురువు.

౬౧. బూటకమైన దేశికుని ♦ బోధలు గాథలు పొట్టకూటికై
పాటలు పాడి గర్వమును ♦ బాగుగ పెంచియు పాపుకొల్లపై
నాటిన ముండ్లపైనడచి ♦ నట్టి సువిభూతియుబూసినట్టి మదిన్
వాటక చేల నిన్నెరుగ ♦ దన్నన్ బ్రోల్పురి చెన్న కేశవా

నైవభక్తిహీనము.

౬౨. నిన్ను దలంపలేని బుధ ♦ నిందితు డెన్నగ కొమ్ము తోకలే
కున్న మదరఫునున్న నిను ♦ యుజ్వలమూర్తిగ జూడకున్న యా
కన్నులు గచ్చకాయలన ♦ గాదగదే మరి నీదు భక్తులే
నన్నిట మిన్నవారు ధర ♦ నన్నన్ బ్రోల్పురి చెన్న కేశవా

౬౩. పాడిన నిన్నె పాడవలె ♦ భక్తిరసంబగు మంచిపాటతో
వాడిన నిన్నె వాడవలె ♦ వాసవుడైనను మెచ్చు మాటతో
వేడిన నిన్నె వేడవలె ♦ వేదవిదుల్ముదమొందు నోటితో
నాడెద నీమహాత్మ్యమిల ♦ నన్నన్ బ్రోల్పురి చెన్న కేశవా

౬౪. కవితము జెప్పజాలతియును ♦ కష్టము వేడిమి నెత్తికెక్కినన్
తనపద భక్తితోడనిటు ♦ తాగ్గాని జెప్పగడంగినాడనో
భవనుత సారసాక్ష నను ♦ బాగుగ రక్షణసేయుమయ్య నీ
యవిరళ రూపమున్ దలతు ♦ నన్నన్ బ్రోల్పురి చెన్న కేశవా

ప్రపంచోత్పత్తి.

౬౫. ప్రవిమలమైన నీజగము ♦ భావముగన్గొన నాది మిన్నులో
పవనుడుబుట్టె న్గాలనికి ♦ పావకు డుజ్వలమూర్తిబుట్టె మేల్

జననముతోడ నాతనికి ♦ చక్కఁగ నీరముబ్బొకి నందులో
నవనిజనించె చొదువలె ♦ నమ్మనబ్రోల్పుర చెన్నకేశవా

భూలక్షణము.

౧౬. భూవలయంబు గుమ్మటము ♦ పొల్కఁ బ్రభాకరు చుట్టివచ్చు పై
కావలివాడుగా దిరుగు ♦ కైరవమిత్రుఁడు భూమిఁజుట్టు తా
రావళిన ట్లివేగజను ♦ నన్నిటికెన్నగ నీ మహాత్మ్యమే
నావరశక్తి నీకెతగు ♦ నమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

దైవశక్తి.

౧౭. జీవుల తోల్బొమ్మలుగ ♦ జేసియు మాయ పటంబులోపలన్
లావగు కర్మరజ్జువులు ♦ లంకెలువేశి బిగించిబట్టి యీ
క్ష్మావలయంబు లాఘవర ♦ సజ్ఞతనాడగ జేసితౌర హా
హావరశక్తి నీకెతగు ♦ నమ్మనబ్రోల్పురి చెన్నకేశవా.

విష్ణువర్ణన.

౧౮. చలువలరేడు చైత్రులకు ♦ సాకిరి కన్నులు జుట్టు కైదువుల్
వలమురిదాల్చి పన్నగల ♦ బంగరుపుట్టముగట్టి సొంపుగా
పులుగుల పెద్దనెక్కఁబలు ♦ పోకిరిపోకులు గొట్టి లచ్చితో
నలరెదువేల్పు నీవెగద ♦ యమ్మనబ్రోల్పురి చెన్నకేశవా.

౧౯. చేడెలు పూరుషుల్సుతులు ♦ చెట్లును గుట్టలు కొండలున్నదుల్
కోడెలు గుర్రముల్ కగులు ♦ కోజలుపేటలు సూర్యచంద్రులున్
మేడలు పంచభూతములు ♦ మేళనచే నిటు నీకు నిజ్జగం
బాడెడు బొమ్మలాటగద ♦ యమ్మనబ్రోల్పురి చెన్నకేశవా.

౨౦. నగవరధీర నీవలన ♦ నవ్యమతంబులు ప్రజ్వరిల్లెనో
నిగమవిచార నీవలన ♦ నేర్పడె నీ సచరాచరంబులో

ఖగపతివాహ నీవలన ♦ గావబడెఁ సకలప్రపంచముఁ
యుగణితమయ్యె నీమహిమ ♦ లమ్మనబ్రోల్పురి చెన్న కేశవా

## మత్స్యావతారము.

౨౧. వేదములన్ని దొంగిలియు ♦ నెల్లినముచ్చగు సోమకాసురుఁ
క్రోధముఁగోడ నంబుధిని ♦ గ్రుంకివధించి (శతుల్గ్రహించి యా
మేదిని పైకివచ్చి యవి ♦ మెచ్చగ బమ్మకు నిచ్చినట్టి నీ
వాదిలో మత్స్యమైతివట ♦ యమ్మనబ్రోల్పురి చెన్న కేశవా.

## కూర్మావతారము.

౨౨. సాగరముఁ మథించుటకు ♦ సంతసమొప్పగ దేవదానవుల్
భోగిని మందరంబునకు ♦ పొల్పగ జుట్టునుజుట్టి త్రిప్పగా
భోగిబలంబుచే మునిగి ♦ పోవగనీయక కూర్మరూపమై
యాగిరి నెత్తినాడవట ♦ యమ్మనబ్రోల్పురి చెన్న కేశవా

## వరహావతారము.

౨౩. మును కనకాక్షు డీపుడమి ♦ ముద్దను గైకొని సత్వరంబునఁ
వననిధిలోన డాయుడన ♦ వానిపిరుందన నేగియుఁ మహా
ఘున వరహావతారమున ♦ కాంచననేత్రుని ద్రుంచినట్టి నీ
వనఘ వరాకముండవట ♦ యమ్మనబ్రోల్పురి చెన్న కేశవా

## నరసింహావతారము.

౨౪. మానుము శౌరిపై దురిత ♦ మార్గము దండ్రియటన్న కోపుడై
సూనుని బోధలఁ వినఁ ♦ ప్రాకృతగింప దలంపుచేయసిఁ
బూనినయట్టి హేమకసి ♦ పుంగొనగోసుల జీల్చివేసినా
నరసింహ్వమూర్తివట ♦ యమ్మనబ్రోల్పురి చెన్న కేశవా.

### వామనావతారము.

౨౫. వడువునటంచు వేషమున ♦ వామనరూపముదాల్చి నేలమూ
డడుగులు చాలునిమ్మనుచు ♦ యాచనసేయ నొసంగినంత నీ
వడుగులు పెంచి పెంచి జగ ♦ మంతయు జాలక విశ్వరూపవై
యడచితివంట యాబలిని ♦ యమ్మన బ్రోల్పురి చెన్నకేశవా

### పరశురామావతారము.

౨౬. రాజదలంపకన్ మతిమ ♦ హోజ్జ్వలకోపముదాల్చి శత్రుసే
న్యాజిజయుండనంగ నక ♦ లావనిలోన యశంబునొందియున్
రాజులచుంటివా పరశు ♦ రామ సునామము నొప్పినాడ వీ
వాజమదగ్ని పుత్రుడవ ♦ టమ్మన బ్రోల్పురి చెన్నకేశవా

### రఘురామావతారము.

౨౭. క్రూరుడు రావణాసురుడు ♦ గొంకక సీతను లంకలోనిడన్
వారధిగట్టిపోయి కపి ♦ వారముమెచ్చగ దానవాధిపున్
మారణమొందజేసి సుకు ♦ మారిని భూమిజనుం గ్రహించినా
వారఘురాముడీవెయట ♦ యమ్మన బ్రోల్పురి చెన్నకేశవా

### బలరామావతారము.

౨౮. సూరిజనంబులన్ బొగడ ♦ చోద్యముగా వసుదేవ పత్నికిన్
కూరిమిపుత్రులై కలుష ♦ ఘోరము ద్రోయగలేని ధారుణీ
భారముమాన్ప బుట్టితిరి ♦ భాసురతన్ బలరామకృష్ణులు
న్నారయ దేవ మీరెయట ♦ యమ్మన బ్రోల్పురి చెన్నకేశవా

### బౌద్ధావతారము.

౨౯. పెద్దలజంపు రక్కసుల ♦ బీచమడంచనుబోవు శూలికిన్
బెద్దసహాయుడౌగి మది ♦ మెచ్చగ న్నాత్రిపురాసురాదులన్

తద్దయు దృగించి బుద్ధయవ ♦ తారుడనంగ ప్రసిద్ధినొందినా
వద్దమువంటివాడవట ♦ యమ్మనబోల్పురి చెన్నకేశవా

## కలిశావతారము.

౮౦. కలియుగమందు మానవులు ♦ కల్మషమానసులాది ధర్మశూ
న్యులు పలుగాకులార్యమత ♦ మొప్పనిదుష్టులుగాన సత్యముల్
నిలపను బ్రీతిగాదలచి ♦ నిర్మలమౌ కలికావతారమం
దలరెడువాడ వీవెయట ♦ యమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

౮౧. శ్రీధరుడంబ్రదు కొందరిల ♦ చెన్నుగ నీవు దశావతారముల్
భేదముతెత్తినావనుచు ♦ పెక్కువిధంబుల వేడుచుందురో
మాధవ శంఖచక్రధర ♦ మంగళవిగ్రహ లోకనాథ నీ
వాదియులేని దేవుడవు ♦ యమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

## రక్షణసామ్యము.

౮౨. భువి కరినేలినావనుచు ♦ పుణ్యుడు ధర్మజుపత్నికిన్ మహా
సువసన మిచ్చినావనుచు ♦ సూడునితమ్ముని రేనిజేయుటన్
ప్రవిమలమూర్తివంచు నిను ♦ బ్రస్తుతిజేతురు నన్నుబ్రోచినన్
యవి నిజమంచు నమ్మెదను ♦ యమ్మనబోల్పురిచెన్నకేశవా

## అంతా దేవుడే.

౮౩. దేవుడనంగవేరె పర ♦ దేశమునందునలేదు సర్వముల్
దేవమయంబు నీజగము ♦ దేవునిలోపలనుండు లీనమై
భావములేచువేళను ప్ర ♦ పంచము నేర్పడు సర్వశక్తి నీ
కావల నీవలేమిగల ♦ దమ్మనబోల్పురి చెన్నకేశవా

౮౪. కమలముఖుండమొంది రవి ♦ కాంతులుబాగిన వాడిపోవునా
కమలము నగ్నిబొంది చెలి ♦ కాడటు వీచిన రూపుమాయునో

కమలభవామరార్చిత వి ♦ కాగ్రప్రపంచము నీవుసొంద్దినన్
యమలుడవీవె సుస్థిరుడ ♦ వమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

ప్రకృతి స్వభావము.

౮౫. బీజమునందు నన్నమిడి ♦ పెంపగు నాకును శాఖలున్ మొదల్
భూజమువృద్ధిఁబొందినటు ♦ భూస్తలమాది సమస్తభూతముల్
రాజిత మొప్పె నీప్రకృతి ♦ రమ్యము నీ నుటుమాయకల్పనల్
హాజగధీశ చోద్యమగు ♦ నమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

౮౬. ముచ్చటదోచె నీజనుల ♦ మోహసముద్రములోమునుంగుటల్
హెచ్చుగదోచె నీజగము ♦ లెల్ల సృజించి నడంచుచుండుటల్
జచ్చినయట్టి భూతముల ♦ సంగతిగాఢసుషుప్తినంటిదా
నచ్చెరువయ్యె నీమహిమ ♦ లమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

మెరుక.

౮౭. కన్నులజూచుచుండునది ♦ గానముతోనిను పాటపాడుచున్
సన్నుతి శేయుచుండునది ♦ సాధులు దెల్పెడు పుణ్యగాథలున్
విన్నది వేదశాస్త్రములు ♦ వేడినవారికి బోధ జేయుచుం
డన్నియు నొక్కటే నెరుక ♦ యమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

౮౮. ఎరుకయె పుణ్యపాపములు ♦ యెమ్మెలు చిమ్మెలుసౌఖ్యదుఃఖముల్
యెరుకయె మంచిచెడ్డలును ♦ యింపగు దారసుతాది ప్రేమలున్
యెరుకయె వేదశాస్త్రములు ♦ యిమ్మహిరూపసమస్తలోకముల్
వరయగ నొక్కటే నెరుక ♦ యమ్మనబ్రోల్పురి చెన్నకేశవా.

కాలప్రభావము.

౮౯. గాలియెయిళ్ళగూర్చి తివ ♦ గన్ జలముల్ గురిపించినట్లుగా
కాలము సర్వలోకముల ♦ కల్పనజేసి నడంచుచుండు నా

కామ్యము కర్మజీవులకు ♦ కారణమై మది నూర్చుచుండు వి
ద్యాలయబాధ నీమహిమ ♦ లమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

## దేహాన్య భావము.

౯౦. జీవుఁడు నొక్కఁడైన మది ♦ చేష్టలు మాఱుట కేమి కారణం
బా విధమంత జూడ పర ♦ మాత్మ సృజించిన భూతలంబులా
నే విధి నీరు మారునటు ♦ లెన్నఁగ దేహులు తత్వభేదముల్
యీ విధులన్ని నీమహిమ ♦ లమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

## జన్మమాహాత్మ్యము.

౯౧. వట్టిప్రపంచమంచు నిజ ♦ వర్తన చెల్వెడు సద్గురూక్తిచే
గట్టిగ నెఱింగి మోహమును ♦ ఘోరశరీరము రూపుమాపినన్
బుట్టడు జీవు డెన్నటికి ♦ పొట్టనుదీసిన గింజరీతి నీ
పట్టుల నేర్పినాడవిల ♦ నమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

## అంతా మాయ.

౯౨. శ్రీకరమైనవారధులు ♦ చెల్వుగు నీ పదునాల్గులోకముల్
లోకులు సర్వజంతువులు ♦ రోషము వేషము శాంతమోహముల్
చీకటి వెల్తురున్ రవియు ♦ శీతకరాదుల మాయ జూడగా
వాకసమందు మేఘములు ♦ నమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

## ముక్తిలక్షణము.

౯౩. అరటిబాయకున్న నత ♦ డాత్మనెఱుంగడు ముక్తిబొందలే
డారటి పైననుండు తెలి ♦ వారెడు నిద్రనెఱుంగకున్న తా
నారటిలోన జిక్కుపడి ♦ నంతముగానక జచ్చి పుట్టుచుం
డారటివీడి రన్ గలుగ ♦ దమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

## దైవ ప్రభావము.

౬౪. పుట్టిన సర్వజీవులను • బాగుగ లేపి సమస్తకార్యముల్
మిగులగ జేయ నల్పి యటు • మీదట రేయిని నిద్రబుచ్చుచున్
జగముల తల్లిదండ్రివలె • జాగ్రతగా నిటు గాచుచుంటివా
నగణితమయ్య నీకరుణ • యమ్మనప్రోల్పురి చెన్నకేశవా

## సర్వశక్తిసహితుడు దేవుడు

౬౫. నిన్నుదలంచు మానవులు • నిర్గుణుడంచు గుణుండటంచు దా
మెన్ని విధంబులో దలతు • రిన్నియు నీమాటుమాయశక్తిచే
నన్నియు జేసి జేయనటు • లాత్మకు దోపగ జేసినాడవీ
వన్నిటికిన్ సమర్థుడవు యమ్మనప్రోల్పురి చెన్నకేశవా

## వైరాగ్యము.

౬౬. ఉద్భవమైన శతాబ్దశత • మున్నిసనేమి మహాధనంబులున్
సద్భవనంబులుండినను • సార్థకమేమి సమస్తలోకమే
తద్భవకర్బరోర్ణవము • దాన ప్రయోజనమేమి దోచదే
యద్భుతమయ్య నిమహిమ • లమ్మనప్రోల్పురి చెన్నకేశవా

## ప్రళయము.

౬౭. శ్రీకరమైన నీపుడమి • జెప్పక నీరమునందు పోవునా
ప్రాకటమైన నీరుగన • పావకకీలలయందునింక బల్
లేకువతోడ పావకుని • తీక్ష్ణమమంత నడంచువాయువా
యాకసమందు లీనమగు • నమ్మనప్రోల్పురి చెన్నకేశవా

## దేవుడు నిత్యుడు.

౬౮. వచనముగాపు మానవుల • వర్తనగాపు వికారలోకముల్
ప్రచురముగాపు భూతముల • ప్రజ్ఞలుకాపు సమస్తదేశముల్

రుచులుసుగావు స్పర్శంపల ♦ రూపముగావు దలంచిచూడగా
నచలుండవీవు నిత్యుడవు ♦ యమ్మనబోల్పురి చెన్నకేశవా

కనుపడునది మాయ.

౯౯. గన్నదిమాయ శాస్త్రములు ♦ కల్పనమాయ శరీరసౌఖ్యముల్
చిన్నెలు మాయభాగ్యములు ♦ చేడెలుపుత్రులుమాయవస్తువుల్
వన్నెలు మాయలోకముల ♦ వర్తనమంతమరీచికా జలం
బన్నియుమాయ నీవునిజ ♦ మమ్మనబోల్పురి చెన్నకేశవా

పరిపూర్ణము.

౧౦౦. పుట్టను గిట్టజన్నటికి ♦ పోంకము లేనిది రెండుచేతులన్
బట్టిన జిక్క దుత్తదగు ♦ బట్టబయల్ గన సందులేనిదై
పట్టున వాక్కుకందనిది ♦ భావము లేనిది యంతుగానరా
దట్టిది పోరులేని బయ ♦ లమ్మనబోల్పురి చెన్నకేశవా

సాకార దైవప్రార్థన.

౧౦౧. ఘనఘన కాయకంతుజన ♦ కా యసురేంద్రనుతాయ మానివ్ర
ద్యానజకరాయ సూరిజన ♦ వందిత తోయజలోచనాయ కాం
చన వసనాయ శంఖు గద ♦ చక్ర ధరాయసుభాగ్యదాయకా
యనుపమశ్రీధరాయధర ♦ నమ్మనబోల్పురి చెన్నకేశవా

ప్రార్థనము.

౧౦౨. అమ్మన బోలుకాపురము ♦ నందున నీ పదవారిజంబులన్
నమ్మి వసించినాడ నన ♦ నాటకము ల్లమ కంకితంబుగా
కమ్మగ జేసినాడ నను ♦ గావగ భారము నీదెగాదె నా
కమ్మవు దండ్రివీవె ధర ♦ నమ్మనబోల్పురి చెన్నకేశవా

౧౦౩. భటుడను నీదుభక్తులకు ♦ పాపములెన్నియు జేసినాడనో
యటువుగ నేలుమంచు నిను ♦ ప్రార్థనజేసితి నాగినేని పే
కటకవి నెట్లుప్రోచెదవో ♦ గావ మరెవ్వరు నాత్మలోపలన్
హాటముగ నిన్నుగొల్చెదను ♦ నమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

౧౦౪. శుభము చిరాయువున్ సుఖము ♦ సూరిజనంబులుమెచ్చునీతి స
త్సభల వచోవికాసమును ♦ సంతసమున్ తవభక్తిమానసం
బుభయులయందు సత్కరుణ♦యార్జితధర్మము కూర్మియున్ సదా
యభయమొసంగి ప్రోవుమిటు ♦ లమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

౧౦౫. బయలునబుట్టి జీవములు ♦ భాసమునొంది చరాచరంబులున్
బయలున లీనమై జనును ♦ బ్రహ్మమనంగను వేరె యుండెనా
బయలన నిష్కళంకమిది ♦ భావములేనిది యాదిగానరా
వయలము వృత్తిన్ సర్వజగ ♦ మమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

౧౦౬. సారసనేత్ర దాసజన ♦ సన్నుత సద్గుణ దీనపోష సా
కార మునీంద్రవంద్య పద ♦ కంజదళాక్ష సుభక్తిమానసం
బోరుపు జేసి నీశతక ♦ ముత్పల చంపకమాల వృత్తముల్
హారము వేసినాడ తమ ♦ కమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

కందగీతి గర్భచంపకమాల

౧౦౭. ఘనఘన సుందరానిపుణ ♦ కంతునిగన్న ప్రవీణసార దు
ర్జనహరణాధిపాపరమ ♦ శాంతశిఖామణి భక్తరక్ష పా
వనముని సన్నుతావరద ♦ వారణపాలన వారిజాక్ష రా
యనియుసనే సదాసిరుల ♦ నమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

౧౦౮. మంగళమయ్యనీకుబుధ ♦ మానిజనార్చిత పాదవారి జా
మంగళమయ్యనీకుకవి ♦ మానసపూజిత లోకరక్షణా

మంగళమహత్యనిత్యవిభు ♦ మాధవ శ్రీధర శౌరి మంగళం
భంగజకోటిప్రభాధర ♦ నమ్మనబ్రోల్పురి చెన్నకేశవా

1910 సంవత్సరం మార్చి నెల రచించినది.

గద్యము.

ఇది శ్రీ హరి చరణారవింద మకరంద బిందాస్వాద
నేందిందిరాయమాన మానసుండును రమ్మవంశ
జుండును క్రిష్ణయ్యతనూభవుండును నవనాట
కాలంకారవిరచిత యశో దురంధరుండు
నగునా.నేని వెంకటకవీంద్ర ప్రణీతంబైన
అమ్మనబ్రోలు చెన్నకేశవశతకము
సంపూర్ణము



## మావద్ద వెలకు దొరకు గ్రంథములు.

| | |
|---|---|
| శ్రీరామజననాటకము పోస్టేజిగాక | రు 0—10—0 |
| శ్రీరామలీలానాటకము | 1—6—0 |
| శ్రీకృష్ణలీలానాటకము | 1—0—0 |
| శృంగారోషాకల్యాణనాటకము | 0—14—0 |
| చిత్రసారంగధరనాటకము | 0—14—0 |
| చిన్నకేశవశతకము | 0—4—0 |
| జగన్మోహనపదములు | 0—8—0 |
| హాస్యానందప్రదాయిని | 0—8—0 |
| హరిశ్చంద్ర నాటకము పోస్టేజిసహా | 1—0—0 |

ఈగ్రంథముల టయిటిల్ పేజీయందు నాచేవ్రాలునునాముద్రయు ను గలిగియున్నవి. అలాలేని పుస్తకమునుపట్టుకొని నాకు తెలియజే సినవారికి బహుమతి యివ్వబడును.

సదరు గ్రంథము కావలయువారు వంగవోలుతాలూకా అమ్మ నబ్రోలుపోష్టుకు గ్రంథకర్తగారికివ్రాసి తెప్పించుకొనవచ్చును.